ప్రియా దెయ్యంగారు

*నేనొక ప్రియమైన పిశాచిని*

# మరణించిన వెంటనే …

JANUARY 27, 2011 24 COMMENTS (HTTPS://PRIYADAYYAMGAARU.WORDPRESS.COM/2011/01/27/%E0%B0%AE%E0%B0%B0%E0%B0%A3%E0%B0%BF%E0%B0%82%%E0%B0%B5%E0%B1%86%E0%B0%82%E0%B0%9F%E0%B0%A8%E0%B1%87/#COMMENTS)

మొదటిటపా చదివినవారికి కృతజ్ఞతలు. కామెంటిన వారికి ఇంకానూ. రెండో పోస్టు నా ప్రియసఖి భజనా డ్రామానిజం రాస్తానంది కానీ ప్రస్తుతం ఆమె ఒబామా తో డిన్నర్ మీటింగులో ఉంది. ఇక రేపు ఎల్లుండీ బ్రిటీష్ రాణితో బిజీ బిజీ. అందుకే ఇది నేనే రాస్తున్నా.

*******************************************************



చాలామంది అడిగారు, చనిపోగానే ఏం జరిగింది అని. పోయేముందు కాసేపు కోమాలో ఉనాను కాబట్టీ చనిపోతుండాగా ఏమిజరిగిందో నాకు తెలియదు. కానీ చనిపోగానే ఒక విచిత్రమైన అనుభవం. కళ్ళు తెరిచి చూసిన వెంటనే నాకళ్ళముందు దేదీప్యమానంగా వెలిగిపోతున్న పరిసరాలు. ఆ కాంతి అలవాటయ్యేదాకా కళ్ళూ మూసుకున్నా కూడా. గాలిలో తేలిఫాతున్న ఫీలింగ్ – నా బొంద ఫీలింగేమిటీ నిజం



గానే గాలిలో తేలుతుంటేనూ? చిన్నప్పట్టినుంచీ గబ్బిలంలా గాల్లో ఎగరాలన్న కోరిక అలా తీరిందన్నమాట.

ఇంకేం నా నోట్లోంచి పాటలొచ్చేశాయంతే –

వాన్ టూ త్రీ నేనింకో దెయ్యమూ

ఎంతైనా భజనతోనే నెయ్యమూ

ఎవడైనా అడ్డొస్తే వెంటనే కయ్యమూ

ఫోర్ ఫైవ్ సిక్స్ నేనింకో దెయ్యమూ

***********

“ఆపవే తింగరబుచ్చీ! నీ గొంతుకి నాకు భయమేస్తోందే” అన్న పరిచయమైన కంఠం వినబడగానే అటువైపు చూసి నా కళ్లని నేనే నమ్మలేకపోయా. అక్కడ నిలబడ్డది సాక్షాత్తూ సౌందరరాజన్ దెయ్యంగారు. అదే నా దెయ్యపు పితాశ్రీ.

“అప్పా! నీంగ ఎన్న సేరింగా?” అడిగాను

“దెయ్యమయ్యాక అరవం కూడా మొదొపెట్టావా? తెలుగులో ఏడు” అన్నారు ఆయన

“నువ్విక్కడేం చేస్తున్నావప్పా?”

“నీ అమ్మవాడు… నీ అమ్మవాడు….

నీ అమ్మవాడు నాకోసం ..”

“అప్పా పాటలొద్దప్పా. విషయం సొల్లు”

“ఏముందీ? మీ అమ్మ పెట్టే బాధలు పడలేక నేను ఆత్మహత్య చేసుకున్నా కదా?”

“గట్టిగా అనమాకప్పా! బ్లాగర్లు వినేస్తారు”

“వింటే విన్నార్లే. మనకేం భయం? ఆత్మహత్య మహాపాపం కదా అందుకే తిన్నగా నరకానికెళ్ళా. అక్కడ నేను యమరాజాకి తెగ నచ్చేశా. మెచ్చుకుని యమకింకరుడి పోస్టు ఇచ్చాడు. ఇవాళ ఎవరో స్పెషల్ గెస్టు అని చెప్పి తీసుకురవటానికి నన్ను పంపించారు. నిఉవ్వెనన్నమాట ఆ గెస్టువి”

“ఉహూం ఉహూం. ఏమిటీ ముక్కు చీదితే సౌండ్ వేరేగా ఉమంది? సర్లే ఏదో ఒకటి అవునప్పా నేనే. ఎపెండిసైటిస్ తో బాల్చీ తన్నేశా! అయితే నేను కూడా పాపినేనా? నాకు స్వర్గ ప్రాప్తి లేదా?”

“నీకు పూర్తి నరక ప్రాప్తికూడా లేదు. పాపులు క్యూలో చాలామంది ఉన్నారు. ఆ రష్షు తగ్గేదాకా దెయ్యమయ్యి తిరగమని యమరాజు ఆన. కానీ పాపం ఎంతయినా చిన్నదనివి కదా అని స్వర్గానికి, నరకానికి ఒక రౌండుకి అనుమతి ఇచ్చాడు”

“స్వర్గంలో నాకోసం ఆమిర్ ఖాన్, హృతిక్, అర్జున్ రాంపాల్ లాంటి వాళ్ళిఉ బ్రేక్ డేన్సులు చేస్తారా?”

“కాదు. రంభ ఊర్వశి, మేనక”

“అప్పా, అది మగవాళ్లకి. స్వర్గానికెళ్ళే ఆడవాళ్ళ సంగతేమిటి?  ఆడవాళ్లకి కూడ రంభేనా? ఇదెక్కడన్యాయం? స్త్రీవాదులు లేరా అక్కడ?”

“సరే సరే ముందు నరకానికి పద”

********

అదండీ కథ. ప్రస్తుతానికి నేను అట్లాంటికుడి ద్వారా నరకనావ మీద యముడిని చూడటానికి పోతున్నా. వచ్చేటపాలో నరకయాత్ర అప్డేట్స్.

FILED UNDER దెయ్యంగారు

## 24 Responses to *మరణించిన వెంటనే …*

**నాగవల్లి (చంద్రముఖి) says:**
January 27, 2011 at 3:26 am
నా దెయ్యమైన ప్రియా చెల్లి…ఇప్పుడు ఏ చెట్టు మీద వున్నావ్?? ఇంతకి నీ ఒరిజినల్ ఫోటో నేను చూడనే లేదు…అది ఇప్పటికి మిస్టరీ గానే మిగిలి పోయింది.
-నాగవల్లి

**గోకేశ్వర రావు says:**
January 27, 2011 at 4:10 am
గోకేశ్వర రావు

చాలా మంచి దెయ్యాల కథ. ధన్యవాదాలు

**సోము says:**
January 27, 2011 at 4:12 am
దెయ్యంగారూ,

మగవాళ్ళ నాట్య ప్రదర్శనని పెట్టనందుకు స్వర్గంలోని పొగరుమోతు వెధవలందరూ సారీ చెప్పాలి

**భావ్య రోకటిపోటి says:**
January 27, 2011 at 4:15 am
నగవల్లి గారు, గోకేశ్వర గారూ, సోము గారూ

వీలయితే కార్పొరేట్ నృత్యాలమీద మీ అభిప్రాయం చెప్పగలరా?

**వంకర్ says:**
January 27, 2011 at 4:17 am
పాము కాటేసింగ్, చావు వాటేసింగ్. చాలా బాగుంది

**గృష్ణ says:**
January 27, 2011 at 4:20 am
ఈ వచనం నా కవితకి కాపీ. నేనొప్పుకోనూ ఊ ఊ ఊ ఊ ఊ ఊ

**భూతాల ప్రేతాచార్య says:**
January 27, 2011 at 4:56 am
పెళ్ళి అనేది పవిత్రమైన బంధం. మనల్ని వేధించడానికి, మనం వేధించడానికి ఒకరు మనిషి దొరికే అపురూప కార్యం.
నాకు జీవితాంతం వంట చేసి పెట్టడానికి ఒకమ్మాయి ఒప్పుకుంది. మేమిద్దరం త్వరలో ఒకటి కాబోతున్నాం.

వధువు పేరు చెప్పలేదు కదూ – మీ అందరికీ తెలిసిన అమ్మాయే, సృజనా డ్రామానుజం. మేమిద్దరం ఖుషీ సినిమాలోలా పుట్టగానే ప్రేమించుకున్నాం.

సాలార్జంగ్ మ్యూజియం సాక్షిగా, మూసీ నది మీద తెప్పలో పెళ్లి చేసుకోవడానికి నిర్ణయించుకున్నాం.

**న్యూయార్కు నాని says:**
January 27, 2011 at 5:02 am
అనగనగా ఒక కథలు చెప్పే మాష్టారు..

ఆ మాష్టారు తన పుస్తకం పబ్లిష్ చేయించుకోవడానికి హైదరాబాదు వచ్చాడు.
DTP Work, పేపర్ బైండింగు అయ్యిన తరువాత, ఇక్కడే తన చిన్న నాటి ప్రేయసిని పెళ్ళాడాలని నిర్ణయించుకున్నాడు.

వారిపురూ ఇప్పుడు మూసీ నది మీద తెప్పలో పెళ్ళాడబోతున్నారు. వారికి విషెష్ తెలియజేద్దాం.

**నావంతుగా నేను, నాదగ్గరున్న 120 డ్రాయర్లను పెట్టి.. ఛీ ఛీ.. 120 డాలర్లను పెట్టి ఒక గిఫ్ట్ కొన్నాను.**

**కులికే కట్టె says:**
January 27, 2011 at 5:21 am
ఆడ యమలోకం లేనందుకు… మరియు మగ స్వర్గంలో మేల్ గాళ్ళతో డాన్సింగులు లేనందుకు…. మాకు ఈ పురుష జాతి క్షమాపణలు చెప్పాలి…

**న్యూయార్కు నాని says:**
January 27, 2011 at 5:52 am
** 120 డ్రాయర్లను పెట్టి.. సారీ, 120 డాలర్లను పెట్టి గిఫ్ట్ కొన్నాను.

**appi-boppi says:**
January 27, 2011 at 6:51 am
ఇది creativity కి పరాకాష్ట. కీప్ గోయింగ్. ఈ talented పర్సన్ ఎవరో తెలుసుకోవచ్చా? ఇలా ఉండాలి కెలుకుడు,పారడి అంటే. గ్రేట్ జాబ్

**నాగవల్లి (చంద్రముఖి) says:**
January 27, 2011 at 6:55 am
మొత్తం బ్లాగ్గేర్స్ లో దెయ్యాలు ఎన్ని? ఆడ దెయ్యాలు ఎన్ని? మగ దెయ్యాలు ఎన్ని? అసలు దెయ్యాలు ఎన్ని? ఫేక్ దెయ్యాలు ఎన్ని?
దీనికి సమాధానం తెలిసి చెప్పకపోతే, ధనరాజ్ మన్మధ కూడా బైక్ మీద దెయ్యం లా వస్తాడు చైనా స్మశానం నుంచి.

**అ. సౌమ్య says:**
January 27, 2011 at 7:08 am
really, great job guys……..this is a decent kelukudu….liking it!

**రహ్మానుద్దీన్ షేక్ says:**
January 27, 2011 at 8:01 am
నాకు తెలిసినంత వరకూ ఈ మధ్య మన్మధన్ చెంబు అనే పేరుతో ఒక ప్రొఫైల్ తయారైంది
సో ఆ ప్రొఫైల్ ఈ ఫేక్ దెయ్యం ప్రొఫైల్ ఒకరిదే అని నా అనుమానం
పైగా ఇది అసలైన దెయ్యం అయితే కృష్ణ నామ స్మరణతో ముక్తి పొందేది!!!

**అంచేత నేను సుత్తి కొట్టేదెందుకంటే says:**
January 27, 2011 at 1:07 pm
నెట్ లో దొరికిన ఈ దెయ్యం బొమ్మకి హాట్సాఫ్

**జలజ తోటమాలి says:**
January 27, 2011 at 1:24 pm
మీ బ్లాగింగ్ చాలా బాగుంది అని చెప్పడం తక్కువ అవుతుంది . దయ్యానికి ఆత్మ కన్నా ఆవేశం ఎక్కువ . భావి బ్లాగు దెయ్యాలలో నేను ఇదే చూసాను. దెయ్యాలు వేదాలు వల్లిస్తే , పిశాచాలు బ్లాగు రాస్తే కాదు కాదు ఈ రెండూ మారాయి

**buddy says:**
January 27, 2011 at 1:30 pm
baagu baagu bale raasav annai….bestu complimentsu neeku..hehehe…

**భజన డ్రామా'నిజం' says:**
January 27, 2011 at 2:04 pm
mare

**అదేదో చార్య says:**
January 27, 2011 at 2:05 pm
అసలు చావంటే తెలుసా??
ఎంత భయంకరంగా ఉంటుందో తెలుసా??
నిజంగా ఆ విలువ తెలిస్తే మీ ప్రవర్తన ఇలాగే ఉంటుందా ??
ఇలా మరణాన్ని ఎటకారం చేస్తూ టపాలు రాస్తారా ?? దెయ్యం అంటూ కామెడీ చేస్తారా ????

**priyuDu says:**
January 27, 2011 at 3:34 pm
1)అయ్యబాబోయ్ కళ్ళు బైర్లుకమ్మి మైండ్ బ్లాక్ అయిపోతున్నాది. ప్రియ మదర్ గారికిప్పుడెలావుందండీ?
2)ప్రియా.. ఏదీ ఓసారి వచ్చి ఇది అబద్ధమని చెప్పి, నీ అల్లరి చేయవా?

**రహ్మానుద్దీన్ షేక్ says:**
January 27, 2011 at 4:49 pm
::)

**కోతి గాడిదగుడ్డు says:**
January 27, 2011 at 5:42 pm

నేను దయ్యాలతో మాట్లాడతా తెల్సా.దయ్యాలుకు కుడా కోతి, కొండముచ్చు అంటే ఎంతో ఇష్టం అనుకుంటా.ఎంతొ చక్కగా నేను చెప్పేది అంతా విని (చెవిలో చాట యెం కాదు? )నీ తప్పేం వుంది లె కోతి అన్నరు.వాళ్ళకి నేను నేల రొజుల కిందట పెట్టిన "కోతికా బుర్ఫీ " పెడతా మా ఇంటికి వచ్చినప్పుడు.

చివరగా తవన్

నేను ఇల పిచ్చ రాతలు రాస్తు వుంటా కాని నువ్వు పట్టించుకోకు.సరేనా?

మార్గరీట : యి కామెంటు ఇలాగే వుంచుతా.నేనేం బాషా చెల్లి నా ఒక రోజు ఒక సారి రాస్తే 100 అవటంకి.అంత సీరియల్ లేదమ్మా

**మన్మధన్ చెంబు says:**
January 27, 2011 at 6:32 pm
@రహ్మానుద్దీన్ షేక్,
నేనే చెంబు……..మన్మధన్ చెంబు
నాకూ, ఈ చాటకీ ఏంసంబంధం లేదండీ… ఎక్కడైతే అన్యాయంగా 'అన్యాయపు' తపేళాలు మోగిస్తారో, చెంబెత్తుకుని లగెత్తుకొస్తా.

**అఘోరిక says:**
January 28, 2011 at 2:27 am
ఎన్ని కష్టాలు పడుతున్నావు ప్రియా…ఏంటి అక్కడ డాన్సులు చేయడానికి మగవాళ్ళు లేరా? ఇదేనా సామాజిక న్యాయం? ఎక్కడ టీవీ నైన్? ఈ విషయమై యముడితో ఆల్ పార్టీ మీటింగ్ పెట్టమంటే పెట్టట్లేదు ప్రియా! ఇక్కడ వంటరి ఆడదాన్ని నేను ఎన్ని పాట్లు పడుతున్నా సమాజాన్ని ఉద్ధరించడానికి? అక్కడా నీవు నాలాగే నవసమాజపు నిర్మాణానికి పాటు పడు.నీకు తోడు నేనున్నా.

**Blog at WordPress.com.**